# గోలకొండపత్రిక

వృషనామ సం॥ర మార్గశిర బ॥౧౩

సోమవారము


## జపాను ప్రళయము

శాంతిసముద్రం అను అర్థమిచ్చు పసిఫిక్ మహాసాగరములో అశాంతి ఏర్పడింది ఎంతకాలమునుండియో అణగి యుండిన బడబాగ్ని ఒకేమారు పైకి పొంగివచ్చినది ఇంతవరకు జరుగుచుండిన యుద్ధము యూరోపులోని ఇంగ్లాండు,ఫ్రాన్సు, జర్మనీ,రష్యా, ఇటలీమున్నగు దేశాలకును అచ్చటి ఇతరచిన్న దేశాలకును జరుగుచుండెను జపానుయుద్ధములో ప్రవేశించి అమెరికాపై కూడా యుద్ధము ప్రకటించిన ఇప్పుడీ యుద్ధం ప్రపంచ యుద్ధముగా మారిపోయింది అన్ని ఖండాలును ఇప్పుడు పూర్తిగా యుద్ధములోచేరినవి ఇక యుద్ధములో చేరనిదేశాలు ఏ అయిదారు చిన్న చిన్న దేశాలో నిగిలిపోయియున్నవి అవికూడా ఈ సుడిగుండములో ఎప్పుడు తగుల్కొనునోయేమో

పడమటిదిక్కున జరుగు యుద్ధముపై మనదృష్టి ఉండింది ఇప్పుడు పడమటిది చప్పబడింది కటాలున మన దృష్టియంతయు తూర్పుదిక్కు ఈడ్వబడింది ఈ రంగములో యుద్ధమును అర్థముచేసికొనుటకుగాను పాఠకులు కొన్ని ముఖ్యవిషయాలను గమనించి యుండవలెను! మనరాష్ట్రములో పల్లెలలోనివారు భూగోళమును చదువరు ప్రపంచవిజ్ఞానానికి ప్రపంచభూగోళము చాలాముఖ్యమైనది ఇకనైనను పల్లెలలోని ప్రతి విద్యావంతుడును సమగ్రమగు ప్రపంచ భూగోళమును తెప్పించుకొని చదువుకొనగలరు యుద్ధము మూలాన మనకేమి లభించకున్నను భూగోళ విజ్ఞానమైనా లభించితే అదియును కొంత లాభకారియే ఇక ప్రస్తుతాంశమును గమనింతము

జపాను ఉండునది పసిఫిక్ లేక శాంతి మహాసాగరములో అది చిన్న చిన్న ద్వీపాలతో కూడిన దేశము దాని వైశాల్యము 260000 చదరపుమైళ్లు జనసంఖ్య ఎనిమిదిన్నరకోట్లు ఈ పసిఫిక్ మహాసాగరములో వేనవేలు చిన్న పెద్ద దీవులుకలవు. మన ఏషియాఖండమువారు సబ్ధులై యుండువారుకాన యూరోపుఖండము వారును, అమెరికా ఖండమువారును ఈ దీవుల నన్నింటిని పంచుకొనిరి గత మహా యుద్ధములో జపానువారికిన్నీ కొన్ని దీవులను పంచియిచ్చిరి అమెరికావారు ఫిలిప్పైన్ దీవులకు యజమానులు. ఈదీవులన్నియు మొత్తము౭౧౦౦ ఇందు ౨౪౪౧ దీవులు చాలా చిన్నవగుటచేత వాటికి పేరులుకూడాలేవు ఈ ఫిలిప్పైన్ దీవులలో ముఖ్యమైనది లుజాన్‌దీవి దీనికి ముఖ్య పట్టణము మనిలా దీనిపైననే జపానువారు తీవ్రమైన దాడిచేయుచున్నారు

వీటికి దక్షిణములో డచ్చివారి ద్వీపములున్నవి సుమత్రా జావా, బోర్నియో, సెలిబీస్ మున్నగుదీవులు పెద్దవైనట్టివి వీటికి దక్షిణములో ఆస్ట్రేలియా ఖండమున్నూ న్యూజీలెండు దీవులున్నూ కలవు ఇవి ఇంగ్లీషువారివి వారికి ఉత్తరములో జపానువారి చిన్నచిన్న దీవిగడ్డలున్నవి ఆదీవిగడ్డలలో గవం అను దీవిగడ్డ ఒకటిమాత్రము అమెరికావారిది దానిపై ఇపుడు జపానువారును బాగా దాడిచేసి పట్టుకొన జూచుచున్నారు ఈ దీవులకు తూర్పున అమెరికావారి దీవులున్నవి వానిని హావైదీవులని యందురు వాటిలో ఇప్పుడు యుద్ధము జరుగుతుంది ఇవి అమెరికావారికి చాలా ముఖ్యమైనదీవులు వారు కోట్లకొలది వ్యయముచే॰ ఆదీవులలో గొప్ప ఆనంద భవనాలను, వినోదగృహములను కట్టి అచ్చటి కోటీశ్వరులు ఆనందించుచుందురు అమెరికాకును జపానుకునుమధ్య ఈ మహాసాగరములో ౪౫౦౦ మైళ్లదూరమున్నది ఈయుద్ధములో ఒకేమారు అమెరికానుండి జపానువరకు యుద్ధనావలుకాని విమానాలుకాని పోవుటకష్టము అదుచేత ఈపై దీవులలో అమెరికావారు ఆగి అక్కడినుండి మరల బొగ్గు నూనె నింపుకొని పోగలుగుదురు అవిధముగా వారికి సౌకర్యం లేకుండుటకై జపానువారు ఈదీవులను పట్టుకొన చూచుచున్నారు ఈదీవులకు దక్షిణములో బ్రిటిషువారియొక్కయు ఫ్రెంచివారియొక్కయు చిన్నచిన్న ద్వీపాలున్నవి

జపానుకీయుద్ధములో నలుగురుముఖ్య శత్రువులేర్పడినారు- వారిని ఏ బి సీ డీ దేశాలవారని చెప్పుదురు అనగా అమెరికా, బ్రిటన్,చీనా,డచ్చిఅనువారు ఈ యుద్ధమిపుడు నిజముగా ఇండియాసరిహద్దులోనికివచ్చినదనువిషయము పాఠకులు బాగుగా గమనింపవలెను జపానువారు చీనాలో కొంతగొప్పభాగాన్ని మంచూకోఅను దేశాన్ని ఎన్నడో గెలిచియుండిరి దానికి దక్షిణములో ఇండోచీనా ఫ్రెంచివారిదేశమున్నది దానినికూడా ఇదివరలోనే జపానువారు సరిపెట్టుకొన్నారు దానిప్రక్కన థాయిదేశమున్నది అది లెక్కజమలేనట్టిది దానికి ౫౦ వేల సైన్యమేకలదు దానివైశాల్యము ౨౦౦౦౦౦ చదురపుమైళ్లు, అనగా మన హైదరాబాదు సంస్థానమంతమూడంతలదేశము దాని జనసంఖ్య ౧కోటి ౪౦ లక్షలుమాత్రమే అనగా మనరాష్ట్రములో జనసంఖ్యయెంతో అంతె!అక్కడ అడవులెక్కువ బియ్యముపంటముఖ్యముగుపంట జనులమతము బౌద్ధమతము- జపానువారిదిన్ని అదేమతమే జపానువారు థాయిపై పడీపడకమునుపే ౫ గంటలలోనే థాయివారు తుపాకులు క్రింద పారవేసి దాసోహం అని అన్నారు ఇకదానిప్రక్కన ఉండేది బర్మా బర్మాప్రక్కనబెంగాల్ అనగా ఇండియా తూర్పుభాగము ఈథాయిదేశానికి దక్షిణములో మలయా ద్వీపకల్పమున్నది దాన్ని యింగ్లీషువారు పూర్వమునుండే వశపరచుకొని యుండిరి దానిఅగ్రములో సింగపూరు రేవు కలదు జపానువారు సముద్రముపై ఇండియాపైకి రావలెనంటే సింగపూరు ముందుగానే రావలెను తప్పితే వేలకొలది ద్వీపాలతోనున్న ఫిలిప్పైన్ తూర్పు ఇండియాదీవులు, ఆస్ట్రేలియా ఇవన్నింటిని తప్పించుకొని రావలెను అది అసంభవము కావున ఇంగ్లీషువారు దూరదృష్టితో సింగపూరును అభేద్యమగు వద్మవ్యూహముగా నిర్మించుకొని అచ్చట తిష్ఠవేసియున్నారు అనగా ఇండియాకు సంరక్షకమగు తూర్పుద్వారము సింగపూరు పశ్చిమములో సూయజ్‌కాలువయే దట్టిదేలని తెలుసుకొనవలెను

జపానుకు సముద్రముపైన గొప్ప బలముందని అంటారు అదెట్టిదో ముందు ముందుకాని తేటపడదు ఇప్పటికే మోసము చేతను,ఉద్ధృతముచేతను మూడు నాలుగు అమెరికా నావలను ముంచినారు మొన్ననే ఇంగ్లీషువారి ప్రిన్సు ఆఫ్ వేల్సు, రిపల్సుఅను రెండు యుద్ధనావలను బాంబులతో పగులగొట్టి ముంచినారు బాంబులతో పగులగొట్టుట క్రొత్త పద్ధతి ఆశ్చర్యమేమంటే వేల్సునావకు ౧౬ అంగుళములమందము కల ఉక్కురేకులు అడుగునకవి కట్టియుండిరి అంతటి మందముతోఉన్న రేకులనుగూడ బాంబులు పగులగొట్టినవంటే అవెట్టి బాంబులో ఏమో? రిపల్సు యుద్ధనావను నిర్మించుటకు ౪ కోట్ల రూపాయిలు తగిలెను మరి అందులోని సామానులు తోపులు, యితరపరికరాలు అవెన్నికోట్ల విలువగలిగియుండెనో యేమో అంతకంటే విలువకలది వేల్సునావ ఈరెండును మునుగుటచేత ఇంగ్లీషువారికి ఇంచుమించు ౨౫కోట్ల రూపాయిలకు పైగా నష్టమైనట్లే మరల అట్టివాటిని సిద్ధము చేయవలెనంటే ఒక్కొక్కదానికి రెండేండ్లుపట్టును ఈవిధముగా జపానుప్రళయం ప్రారంభమైంది

ఈ శాంతిమహాసాగర యుద్ధానికి కారణమేమి? అది వ్యాపారార్థమే జపాను వ్యాపార దేశము మరి ఇంగ్లాండు అమెరికా దేశాలున్నూ అట్టివే ప్రపంచములోని వ్యాపారంలో నూటికి ౬౦ పాళ్లవ్యాపారం అమెరికా చేతులలోనికి వచ్చియుండెను జపానుదేశానికి సామ్రాజ్య కాంక్ష మొదలై అనేక సంవత్సరాలయ్యెను ఏషియా ఖండాన్నంతయు (రష్యాను మినహా) తానే ఏలవలెనని జపానుకోరిక మరి ప్రపంచములో శాంతి మహాసముద్రదీవులు, ఇండియా, చీనా, ఆఫ్రికా దేశాలు ఎంతవరకు పరాధీనముగా ఉండునో అంతవరకు ఈసంగ్రామాలు జరుగుచుండునని ఈ ౪౦ ఏండ్ల ప్రపంచచరిత్ర బోధించుచున్నది భావిగతి యెట్లుండునోయేమో? మనకును ఇంగ్లీషువారికిని లంకె ఏర్పడినది ఇంగ్లీషువారి ప్రభుత్వము ఇతరప్రభుత్వాలకన్న మేలైనదనుటలో వివాదమెవ్వరికినీ లేదు ఏదియెట్లున్నను ఇప్పుడు యుద్ధము ఇండియాను సమీపించింది ఈసమయములో పాకిస్థాన్, హిందూస్థాన్ అను వివాదములుకాని, కాంగ్రెసుప్రభుత్వము ముస్లింలీగు ప్రభుత్వము అను కలహములుకాని పెంచుకొనుటకువీలులేదు భారతీయులందరును ఒకే జాతివారను భావన ఇప్పుడైనా కలుగవలెను అంతకలహాలకు స్వస్తి చెప్పవలెను మనదేశాన్ని ఎట్లు రక్షించుకొనవలెనో ఆ మార్గమొక్కటే మనకిప్పుడు ప్రధానమై యున్నది

## జాగీరు రైతుల హక్కులు

[జాగీరురైతులసంఘంవారు ఉర్దూలో ఒకపత్రికను ప్రకటించినారు -అవసరమున్నవారుకొండా వెంకట రంగారెడ్డిగారు, కార్యదర్శి ఫీల్ఖానా, హైదరాబాదుఅన్నివారికి ఉచితముగా తెప్పించుకొనవచ్చును ఆపత్రికలో జాగీరురైతులహక్కు లనుగురించి బాధ్యతలనుగురించి ఆయినతీర్పులు, శాసనములు తెలుపబడినవి అందు క్రిందివి ముఖ్యమైనవి ]

౧ పూర్వమునుండియు అనుభవములో ఉండినభూములపై రైతులకు పట్టాహక్కులుండును, అట్టివారు జాగీర్దారుపేర ఒకనిర్ణయకాలముతో ఖుబూలియతులు వ్రాసియిచ్చినను వారిహక్కులకై అసలుకా సేరదు నిర్ణయ ఖుబూలియతుకాలంపూర్తి అయినతర్వాతవారిని జాగీర్దారు వెళ్లగొట్టజాలడు చూడుడు, అప్పుకో బనాం కిసరాం భట్ దక్కన్ లారిపోర్టు ౧౯-పుట ౧౧౧౯ దివానీ

౨ జాగీర్దారు రైతుల అనుమంతికర్తమని (హామానీ)తీసుకొని యితరులకిచ్చుటకు జాగీర్దారుకుఅధికారంలేదు-చో-రంగనాధబనాంనారాయణ దక్కన్‌లారిపోర్టు ౨౧ పుట ౧౬౭ దీవానీ

౩ బందోబస్తుకాని జాగీర్దారులుకూడా భూములను పూర్వమునుండి అనుభవించుచున్న రైతులపట్టాహక్కులను జాగీర్దారుతొలగింపజాలడూ రంగనాథ బనాంజయువంతదక్కన్ లాను ౩౦పుట ౫౪౦ దీవానీ

౪ పన్నుసరిగాఇచ్చు పాతభూమిలను భావస్థులనువారి పన్నుసరిగాఇచ్చునంతకాలం వారిని తొలగించవీలులేదు గశ్తీ ౩౨ సన ౧౩౧౫ ఫ

౫ జాగీరులేక మఖ్తాభాల్సాఆయువలో అందలి భూములపట్టాజాగీర్దారులేక మఖ్తాదారిపేర కాజాలవు రైతులనుండిసూలహానామాపొంది జాగీరుదారులు పట్టాలనుపొందినను అట్టివి నిగరానిలో కొట్టివేయబడును మ ల్ ౧౪ సన ౧౩౪౫ఫ

౬ పట్టాదారుతనభూమిలో కొత్తలు బావులు కట్టి వృద్ధిచేసుకొనవచ్చును ౧౬సూత్రం మాల్ శాసనం-

౭ బావులుతవ్వినచో వాటికై ఎక్కువపన్ను ఇయ్యవలసిన అవసరము లేదు- ౨౫ ౨౬ బందోబస్తునియమాలు

౮ జాగీర్లబందోబస్తుకుగానుబందోబస్తుశాఖా వద్ద విజ్ఞప్తి నించుకొనవలెను-గశ్తీ ౧ మాల్ సన ౧౩౪౧-

౯ బందోబస్తుఖర్చులను సగము జాగీర్దారున్నూ సగము రైతులున్నూ భరించవలెను-రైతుల భాగం ఆరేండ్లపైన ఇయ్యవలెను-గశ్తీమాల్ ౪ సన ౨౦వై ౧౩౫౦ఫ

౧౦ బందోబస్తులో సవరణలు కావలసివస్తే రెండేండ్లలోపల చేయించుకొనవలెను-సూత్రం ౧౯ మాల్ శాసనం_

౧౧ జాగీర్దారుపన్నులను నిర్ణయమైన తేదీల లోపల వసూలుచేయుటకు అధికారంలేదు-గశ్తీ మాల్ ౧౦ సన ౧౩౦౧

౧౨ బందోబస్తుకాని జాగీర్లలో లోకల్ ఫండు పన్నులు కాగూడదు లోకల్బండుగశ్తీ ౭ సన ౧౩౨౫

౧౩ ఖాల్సాలోలేనిపట్టీలను పన్నులను జాగీర్దారులు వసూలుచేయకూడదు-ఫర్మాను ౫ రబ్బీయుస్సాను ౧౩౨౪హి_

౧౪, కల్దారు రూకలపన్నుకు వసూలుచేయకూడదు

## గద్వాలవార్తలు

మునల్మానుసంస్థలకు శ్రీమహారాణీగారి పోషణ

శ్రీమంతు గద్వాలమహారాణీ బహద్దరుగారు గద్వాలలోని వివిధముస్లిం మతసంస్థలకు చాలా ఉదారముగా పోషణచేసి ద్రవ్యసహాయంచేసినారని గద్వాల అంజుమన్ సేయస్లామియా కార్యదర్శి తెలుపుచు ఈక్రిందివాటికి క్రిందివిధముగా విరాళములిచ్చిరని తెలుపుచున్నారు-

౨౨౫ పిరామిజా మొహల్లాలో మసీదునరందాకు

౨౫౦ సుబ్జార్ మసీదుకు

౨౫౦ ముస్లిం స్త్రీల గృహపరిశ్రమలకు

౪౦ ముస్లిం మతధర్మపాఠశాలకు

౩౫ నూరీమసీదులోని పఠనాలయానికి

౨౫ నూరీ సీదులోని హిఫ్జాఖానా దర్సుకు

ఇంతకుపూర్వము శ్రీమంతుమహారాణీగారు పెద్దమసీదుకు ౧౦౦ రూపాయిలు ఇచ్చియుండిరి_ నూరీమసీదులోని పాఠశాలకు ప్రతినెలకు ౧౫రూపాయిల ప్రకారం ఇచ్చుచున్నారు-

## హైదరాబాదు ధరలు

తేది ౧౧-౩-౫౧ ఫ

పల్లా ౧కి ౧౨౦ సేర్లతూకమధరలిస్తి చాలికే

| బియ్యము | పల్లా ౧కి ధర |
|---|---|
| | రూ అ పై |
| కిచిడి సాంబర్లు | ౨౯ నుండి ౨౭॥వరకు |
| సంబర్లు | ౨౬ ౦ |
| ఢిల్లీబోగాలు | ౨౪ ౦ |
| రాంసాగర్లు | ౨౩ ౨౫ |
| సానక్రోం | ౨౨ ౬ ౦ కొత్తవి |
| | ౨౪ ౬ ౦ పాతవి |
| ఆరార్కటి | ౨౪ ౦ ౦ కొత్తవి |
| | ౨౪-౬-౦ పాతవి |
| గోవామణి | ౨౪ ౬ ౦ |
| బుడుములు | ౨౩ ౦ ౦ |
| దేశావరి | ౨౪ ౦ ౦ వరకు |
| గోధుములు | |
| నిర్మతి | ౨౬ |
| బన్సి | ౨౩ ౬ ౦ వరకు |
| అమ్మూరి | ౨౪ ౦ ౦ |
| పొటియా | ౨౩, ౦ ౦ |
| ఎర్రగోధుమలు | ౨౦ ౨౧ |
| తెల్ల జొన్నలు | ౧౪ ౧౨ ౦ వరకు |
| పచ్చజొన్నలు | ౧౨ ౦ ౦ |
| సెనగలు | ౨౧ ౦ వరకు |
| కందులు యెర్రవి | ౧౪ ౬ ౦ |
| మినుములు | ౧౪ ౦ ౦ |
| ఉలవలు | ౧౪ ౪ ౦ |
| సజ్జలు | ౧౩, ౦ ౦ |
| పప్పులు | |
| సెనగ పప్పు | ౨౪ ౦ ౦ |
| కంది | ౧౯-౨౦-౨౧ |
| సిరిసెనగ, | ౨౧ ౨౨ ౬ ౦ ౨౩ |
| లంక | ౧౬ ౧ ౦ |
| మినప | ౨౧ ౦ ౦ ౧౭॥ |
| పెసర ,, | ౨౦ ౦ ౦ |
| బెల్లము ౨౧ నుండి ౨౧ ౬ ౦ కో॥ ౨౧పా॥ | |
| ఉప్పు | ౧౨, ౧౧ ౪ ౦ |
| పుల్లికడ్డ | ౧౪నుండి౧౩॥ ౧౭॥ |
| పసుపు మంచిది | ౪౫ నుండి ౫౦వరకు కొత్తవి |
| చక్కెర మణుము [౪౦ సేర్లు] | |
| జావా ,, , | ౧౪ ౦ ౦ |
| బొంబాయి | ౧౩ ౧౪ ౦ |
| మద్రాసు ,, | ౧౩ ౧౫ ౦ |
| నిజామాబాదు , , | ౧౩ ౧౨ ౦ |
| ఎర్రచక్కెర , పల్ల | ౨౦ ౦ ౦ |
| దర్గచక్కెర ,, ౪౦ సే | ౧౭ ౧౨ ౭ |
| ఎల్లిగడ్డ మణుము ౧౨ సే | ౫ ౬ |
| అల్లం | ౨ |
| మణుము ౧౨ సే | |
| కొబ్బెరమూనె ,, | ౫ ౧ ౦ |
| కుసుమనూనె | ౫ ౬ ౦ |
| నువ్వులనూనె | ౪ ౪ ౦ |
| వేరుసెనగనూనె ,, | ౪ ౦ ౦ |
| కిరోసిన్ (గ్యాస్ , డబ్బా ౧కి | ౪-౧౨-౦ |
| నెయ్యి మణుము ౪౦ సేర్లు | |
| విదరు నెయ్యి ,, | ౭౫ ౦ ౦ |
| తెలంగానా ,, | ౫౫ ౦ ౦ ౫) |
| వనస్పతి పెట్టె ౧కి | ౧౧ ౭ ౦ |
| ( ముదాము బహా | ౧౧ ౦ ౦ |
| వేరుసెనగ | ౬ ౪ ౦ |
| పప్పు | ౧౨ ౦ ౦ |
| బంగారు తులా ౧కి | ౫౪ ౦ ౦ |
| వెండి ౧౦౦ తు | ౭౬ ౬ ౦ |
| , తు ౧కి | ౦॥౧౦॥ |
| సవరణ్ ౧కి హాలి రూ- | ౩౪ ౬ ౦ |
| మారకం | |
| హాలీకి కల్దార్లు | ౧౫ ౧౨ ౭ |
| కల్దారుకు హాలీలు | ౧౫ ౧౦ ౭ |

## బొంబాయి ధరలు

(డిసంబరు ౧౦వ తేదివ)

| | రూ అ పై |
|---|---|
| దోచిప్రత్తి(ఏప్రిల్ -మేవాయిదా కం(టాక్టు) | ౨౫౧-౧౨-౦ |
| ఉ।నూపత్తి(డిసంబరు-జనవరి వాయిదా) | ౨౧౫-౪-౦ |
| (మార్చివాయిదా) | ౨౦౧-౬-౦ |
| (డిసంబరు౧౦ తేదీన) | |
| వెండి(తయారు) తులాలు౧౦౦కి | ౭౩-౨-౦ |
| , (నవంబరువాయిదా) తు ౧౦౦కి | ౭౭-౬-౦ |
| , (డిసెంబరు , ) , | ౭౭-౩-౦ |
| బంగారు (తయారు) తులం ౧కి | ౪౩-౧౩ -౦ |
| , (నవంబరు వా॥) ,, | ౪౩- ౧౨ -౭ |
| ( డిసంబరు) | ౪౩- ౧౨ - ౦ |

గమనిక...

ధరలు వీలైనంతవరకు సరియైనవిగా తెలుపుచుందుము- అయినను ఏమైన పొరపాట్లుండిన వానికి పత్రికవారు బాధ్యులుకాజాలరు,

## రాబోవు హిందూమహాసభ

ఆసేతు రాష్ట్రములనుండి హిందూనాయకులు బొంబాయికిపోయి రాబోవు హిందూమహాసభను గురించిఅధ్యక్షుడగు వీరసావర్కరుగారితో డిసెంబరు ౧౦ తేదినచర్చించిరి. ఇట్లు చర్చించినవారలలో డాక్టరు మూంజీ, హైదరాబాదునుండి పోయిన యశ్వంతరావుజోషీగారలుగలరు. భాగల్పూరులో హిందూమహాసభను జరుపరాదని అధికారులు నిషేధించినను. మొదట అనుకొనినట్లు క్రిస్మస్ సమయమునందు మహాసభను భాగల్పూరులోనే జరుపవలెనని సావర్కరుగారుచేసినతీర్మానమును వారలుఅందరును ఆమోదించిరి. ఈలోగా వైస్రాయిగారు జోక్యముకలిగించుకొని నిషేధమును తొలగింపజేయవచ్చునని ఆశపడుచున్నారు. అట్లు తొలగించనిచో సభనునిర్ణయముప్రకారము జరిపి దానిఫలితములననుభవించెదరట. భారతదేశమందన్ని రాష్ట్రములనుండియు చాలమంది ప్రతినిధులు పోగలరట. సావర్కరుగారుడిసెంబరు ౨౧వ తేదిన బొంబాయినుండిపోగలరు,

—

## ప్రస్తుతపరిస్థితులు

### నెహ్రూగారి సింహావలోకనం

డిసెంబర్ ౮వ తేదిన అక్నోలో జరిగిన పత్రికావిలేఖకులసభలో అంతర్జాతీయ పరిస్థితులను గూర్చి మాట్లాడుచు పండిట్ జవహర్‌లాలుగారు ఇట్లు చెప్పిరి.

"మనలో అభిప్రాయభేదాలు చాలఉన్నవి. మనముఏపక్షానికి సంబంధించిఉన్నను భారతదేశ స్వాతంత్ర్యమునకౌదర్శముగావుండవలెను, ఈ ఆదర్శమునకై మనముఏకీభవించుటకు అవకాశమున్నది- ఇతరాభిప్రాయభేదాలేమున్నను భవిష్యత్తుకుదదలి కలిసిపనిచేయవలెను అనీయూలో కొన్ని స్వతంత్రరాజ్యాలు యెట్లు తమస్వాతంత్ర్యమును యీయుద్ధములో కోల్పోయినవో చూచినాము కాబట్టి భేదాభిప్రాయాలనుమరచి ఏకాభిప్రాయముతో భారతదేశస్వాతంత్ర్యముకొరకై పాటుపడవలెను-

### వైస్రాయికార్యసమితి విస్తరణ

వైస్రాయికార్యసమితి విస్తరణనుగురించి నెహ్రూగారు ఇట్లుచెప్పినారు:

"ప్రభుత్వములోగాని సేనలలోగాని, అన్ని శాఖలలోను భారతీయులను నియోగించుటయనుదాని అంతరార్థమును ఎప్పటికిని నేను గ్రహించుకోవలేకపోవుచున్నాను- బ్రిటిషుప్రభుత్వముగాని, బ్రిటిషుసైన్యమునుగాని, ఆంగ్లేయమయముచేయవలెననుమాట ఎన్నడునుమనము వినుటలేదే. ప్రభుత్వాన్నిగాని సేనలనుగాని జాతీయముచేయుటనుగురించియే మేము చెప్పుకొనుచున్నాము- అధికారాలు మనహస్తగతముకావలెననే చెప్పుచున్నాము- కనుకమనము అధికారాలమార్పులను, అధికారాలను కంట్రోలుచేయు హక్కులనుకోరుచున్నాము.. కాని భారతీయమయముచేయవలెననుసమస్య ఇప్పుడు బయలుదేరలేదు. ప్రస్తుతపరిస్థితులలో వైస్రాయిగారియిష్టానుసారం, కార్యసమితిలో భారతీయులను నియమించినను అధికారాలు పూర్వసభ్యులకేఉన్నవికాని, భారతీయులకులభించుటలేదు- కాని ఇప్పుడువైస్రాయికికాక, ప్రజలకుబాధ్యులగు ప్రతినిధులనే కార్యసమితిలోఉంచినట్లయితే, అనగా స్వతంత్రబాధ్యతాయుతప్రభుత్వము ఏర్పడినప్పుడు, ఇక వైస్రాయితోనిమిత్తమేఉండదు"

—

## జపానీయ సంబంధానుమానము

### శరచ్చంద్రబోసుగారి అరెస్టు

భారతప్రభుత్వంవారు ఈక్రింది ప్రకటన గావించిరి:-

శరచ్చంద్ర బోసుగారికిని జపానీయులకును గలసంబంధములస్వభావమును పరిశీలింపగా ఆయనను వెంటనే నిర్బంధింపవలసినఅవసరముగలదని ఇండియాప్రభుత్వమువారు నిశ్చయించుకొని అందుచేత వారిని ఇండియారక్షణనియమములక్రింద నిర్బంధములోనుంచునటుల ఉత్తరువులుజారీచేసిరి- ఆయన డిసెంబరు ౧౧తేది మధ్యాహ్నముకలకత్తాలో అరెస్టుచేయబడెను.

—

## ప్రకటన

మింజానిబ్ నందాలలక్ష్మయ్యవగైరా సాకీన్ ముస్తఖర్ జలకరీంనగర్, బట్టలదుకాణదారులు- నందాల గౌరయ్యపేర నెం. 61/1934లో సికింద్రాబాదు కోర్టునుండి గుజ్జర్ గోపాల్ అంబాజీగారి దుకాణమునకు నందాల లక్ష్మయ్య, నందాలగౌరయ్య, నందాలరాజయ్యగార్లపైన మొత్తము ఒకవేయి ఒకనూరు హాలీరూపాయలు [మూడుసహ]కు డిగ్రిదొరకియుండెను. ఈ డిగ్రితామీలుకొరకు అదాలత్ దివానీజిల్లాకరీంగనర్‌కు ముంతఖిల్ అయియుండెను, దానినెం. ముఖద్దమా39/1349 ఫ, అయియున్నది.ముద్యానులు తామీలుకార్రవాయిలోఒకరసీదుఎగ్జిబిట్ [అలీఫ్]రు. 1100/-అది పేషుచేసియుండిరి. ఈ రసీదును అదాలతువారు రుజువుకాలేదని స్థిరపరచిరి. దానిపైన మద్యానులతరఫున వరంగల్‌సూబాసదర్ అదాలతులో మురాఫా దాఖలుఅయియుండెను: దానినెం.ముఖద్దమా 4/1349ఫ. ఈ మురాఫాయొక్క తీర్పు 25యిస్పందార్ 1349 ఫ,నాడుచెప్పబడి మురాఫా నామంజూర్ చేయబడెను దానిపైన మురాఫాదారులపైన మేము మజిలిస్ఆలియాఅదాలతులో మురాఫా దాఖలుచేసితిమి, దీని నెం.మొ 58/1349 ఫ. అయియున్నది. మేము గుజ్జర్ గోపాల్ గారి దుకాణమువారిని క్షమించుమనికోరితిమి. మరిన్ని మాటప్పువారితో చెప్పుకొంటిమి, యదార్థములో ఈరసీదు డిగ్రీదారులదుకాణమువారిచ్చినదికాదు, డిగ్రీదారు యదార్థవది పెద్దవర్తకుడు నిజములోవారికి ఎగ్జిబిట్[అలీఫ్]1లో చెప్పినప్రకారమువారికి ఏమాత్రము పైకము వసూలు అయియుండలేదు, మేమువారిని క్షమాపణ కోరినాము, మరియు మజిలిస్ఆలియాఅదాలతులో దాఖలుఅయిన మా మురాఫాను ఉపసంహరించుకొనుచున్నాము. కావున ఈప్రకటన సర్వజనులకు తెలియుటకై ప్రకటించబడుచున్నది. ఫక్తు.

దస్కతు- గౌరయ్యఅని

ఉన్నది

—

## ముస్లింలీగునుండి ఢక్కానవాబుగారి రాజీనామా

ముస్లింలీగునుండి ఢక్కానవాబుగారు, రాజీనామానిచ్చినారు-ఈవిషయంలో బెంగాలుశాసనసభలో క్రొత్తగాఏర్పడ్డముస్లింలీగు పార్టీనాయకుడగు కె- నాజిముద్దీన్‌గారికి ఢక్కానవాబుగారువ్రాసినలేఖలో ఈరాజీనామా కారణాన్ని అధ్యక్షునికిని, అఖిలభారతముస్లింలీగు సభ్యులకును తెలియజేయు ఒకప్రకటనప్రతిని పంపెదననుచు ఇట్లువ్రాసినారు, "అధ్యక్షుడు మహామ్మదాలీ జిన్నా ముసల్మానులు కాంగ్రెసుకలిసి పనిచేయకూడదనెను మీరును, మీమిత్రులుకొందరును కృషికప్రజాపార్టీవారికిమూడుమంత్రిస్థానాలను మూడుపార్లమెంటరీసెక్రటరీస్థానాలను ఇచ్చెదమనుచు వారలతోను, కాంగ్రెసుతోను ముస్లింలీగునిర్ణయాలకు వ్యతిరేకంగా బేరమాడుచున్నారు.

—

